# స్వర్గభారతయాత్ర

## (A Plan Play)

శ్రీ శేషుబాబు



సారధీపబ్లికేషన్సు, తెనాలి.

 1960 0=75 న. పై.

# పాత్రలు

రాము

రహీం

కష్టయ్య

వెంకయ్య

డా॥ మీనన్

డైరక్టరు, నేపధ్య గాయకులు, 1, 2 బిడారులు

(బి. డి. ఓ. రైతుకూలీలతో)

# స్వర్గభారత యాత్ర

## (Pilgrimage to India's Utopia)



## నాంది

[ ముందు తెఱ లేస్తుంది. ఆకాశపు తెఱపై తగఱవు చంద్రరేఖ (దానిలో మహాత్ముని పాదాలు పడమటి కొనగా అగుపిస్తవి) నీలివెలుగు ఫోకస్! వీణె సౌనాయి, తబలా వినిపిస్తాయి. నేపథ్యంనుండి చంద్రాస్తమయ వర్ణన పద్యం.]

మిణుగురులు, నిప్పుకలు, తారలునె
చెలంగు
అంధకార... మమావాశ్య... యైన
భువిని—
అదిగో! చల్లని వెలుగులనవతరించి,
ప్రాణ మిచ్చెడి గాంధి
కరంసుధాంశి !



[నారింజ రంగు ఫోకస్, తూర్పు కొనగా తగఅపు సూర్య బింబం (వానిలో నెహ్రూ ముఖం అగుపిస్తుంది!) భేరీ! నగారా, బాకా, శంఖం, వినిపిస్తాయి. నేపథ్యం నుండి సూర్యోదయ వర్ణన పద్యం:]



అతడదృశుడై ధర్మము
నట్టినిలుప...
నతని యడుగుజాడలఁ గను లతికి
యుంచి,
'పంచ శీల' ము, ప్రాణముల్
పంచిపెట్టు
'లాలు జవహరు' ద్యుమణి
ప్రణాళి కాళి!

వ॥ ఓహో! మహో దయము! అటు అమరుడైన చంద్రుడు!
ఇటు అనిమిషుడగు సూర్యుడు!
అటు జాతి జనకుని గాంధినీతి! ఇటు నెహ్రూ పాలనా ప్రీతి!
అహో! మహో దయము!!

గేయం॥ స్వాతంత్ర్యజయభేరీ (నినాదం)
స్వ రాజ్య పు—నగారా ఆఁ ( ,, )!
విన వచ్చునవె శంఖాల్ ( ,, )!
ధ్వనియించు జయ ఘంటల్ ( ,, )!
పలికెను జయ — గాళీ ( ,, )!
పిలిచెనూ సేవా—మురళీ ( ,, )!
తీరెను స్వరాజ్య—క్షుధ! తీఱునులే ఉదర క్షుధ!
పారింది విదేశి వ్యధ! పద పథక—పథములలో! స్వా!

2 భారత సౌభాగ్య స్వర్గమ్మును పట్టియున్న అప్రాచ్యుల్
వదలిరి–పున శ్శోభగానుడు! పునశ్శోభ గనుడు! ॥విన॥

3. ఏడు నేడునరకోటి వృకోదరు! లెచ్చుచుండుటలుగన-రా
కూడు, గుడ్డ ఇలు, విద్య, వైద్యముల్ కూడు స్వర్గ
ముకు పద-రా ॥స్వ॥

వ॥ అయితే మఱీ—

గేయం॥ స్త్రీ పుం కాంతుల కంటే తీవ్రము
దేశముపై భక్తీ! దేశము పైరక్తీ!

వ॥ ఆహా!

గేయం॥ సేవే ధర్మ మహో! క్షేమము త్యాగ మహో!
దేశకార్యమున మీరూ! దేవకార్యమున మీరూ
చేరుట కవకాశ మహో! తీరుట కవకాశ మహో!

వ॥ అవే! స్వదేశాన్ని స్వర్గం గావించుకోవాలని, బయలు దేరు తున్నాయి గ్రామాలన్నీ బ్లాకులుగ తీఱి, తండోప తండాలై, కార్వాలు కట్టి!–అందులో ఎందులోనో చేరేవారికీ.

గేయం॥ సర్వదేశము జోహార్! సర్వకాలము జోహార్।
జోహార్! జోహార్! జోహార్!

[భేరీ, నగారా, మురళి, గంటలు మ్రోగి, శంఖం ధ్వనిస్తుంటే వెనుక తెఱ లేచును.]

అదిగో! సమాజ వికాస తండా! రెండవ అంచెలో పురోగమిస్తున్న కార్వా! ఇంకనూ కళ్లు తెఱువని వారికంటె స్వ స్వర్గానికి దగ్గఱలో ఉంది.

[ప్రవేశము—ఒకటవ కార్యా—చేతులలో ఫలకములు, కొడవలి. తాపీ—చిహ్నములు—పట్టుకొని, రైతు, శ్రామికుల వేషములలో—ముందు బి. డి. ఒ.]

1వ బిడారు: (వెనుక పాట కనుగుణముగా విన్యాసాలుచేస్తూ కేదంలో ప్రవేశం)

బిడార్లు సాగాం ప్రణాళికాపథములలో పోదాం కలియండీ
కూడూ, గుడ్డా, విద్యా, వైద్యం, ఇల్లూ పిల్లగుస్వర్గముకూ
ఒకడు: ఏడాది కొకరోజు అదా పొదుపు చేయండి !

రెండవ: నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్లు కొనండి!

మూడవ: మీ నిలువలు మీకు వడ్డీనిస్తాయి! అవే పేదల కన్నం పెడ్తాయి!

రాము, రహీం; (ప్రవేశించి, బిడారిని చూచి, నిలబడి, పలకరిస్తారు)

రాము: అయ్యా! నమస్కారం.

రహీం: మీరూ పాడే ఆ స్వర్గం, ఎక్డా ఉందో, దానికి తోవ ఎటో సెప్తార్, దయాసేసీ! మేము వస్తాం!

ఒక: (నమస్కారం అందుకొని) అదా? సహకారానికీ—

రెం: స్వయం సహాయానికీ.—

మూ: దగ్గర్లోనే !

మా గ్రామా లో బ్లాకులో చేరీ బిడార్ల బారులో చేరాము.
మన దేశంలో గ్రామాలన్నీ కలిసి బ్లాకులుగ సాగాయీ!

రహీం: మీరంతా ఆ స్వర్గానేక్నా, అయ్యా?

రా: మా గ్రామాన్ని కూడా కలుపుకు పొండి దయ చేసి, పుణ్యం ఉండ గలదు.

ఒక; మీ రెవరో గ్రామనాయకులులా ఉన్నారే! పాపం! మీదే గ్రామం ?

రెం: మేం సమాజ వికాస కార్యక్రమం రెండో అంచెలో ఉన్నాం!

మూ: మీరింకా బయలుదేరలేదుగా. ఆ వెనుక కార్వాలో రండి!

ఒక; మాబిడారు సాగిం దాగేది లేదు. సౌభాగ్యస్వర్గం చేరే దాకా విశ్రమించేది లేదు. రండి, వచ్చేవారనుసరించండి

గే॥ ప్రభుత్వపథకం అల్లదిగో! స్వయం సహాయం మాదిదిగో
బిడార్లుసాగాయ్! ఎవ్వరికొఱకూ ఆగవు స్వర్గంకనువఱకూ
కూడు, గుడ్డ, విద్య, వైద్యం, ఇల్లూ పిల్లగుస్వర్గముకూ

(నిష్క్రమణ)

రాము రహీం: (వారి ననుసరిస్తారు) అయ్యా---

రెండవ బిడారు;

గే॥ బిడార్లు సాగాం ప్రణాళికాపథ మెల్లరు పోదాంకలవండీ
కూడు గుడ్డ, విద్యా, వైద్యం, ఇల్లూపిల్లగు స్వర్గముకూ

రాము, రహీం; (ప్రవేశం)

రా: అయ్యా! నమస్కారం. మీరైనా ఆగుతారా? మేమూ వస్తున్నాం.

ర: వెనుక పడ్డ మాకర్మా ఇంతేనా హజ్రత్,

రా: ఇవ్వాళ నైనా కళ్లు తెఱిచాం. మాకా సౌభాగ్య స్వర్గం అందని మ్రానిపండేనా?

ఒక: కాదు. మిమ్మల్నందర్నీ కలుపుకొనే పోతాం. అందుకే

వస్తున్నాం మనం ఇంకో బారులో పోదాం. విచార పడకండి.

రెం: ఇప్పటికీ కళ్లు తెఱవని వాళ్లుంటే, వాళ్లనీ మేలుకొల్పు కొని, మఱీ తీసుకు పోదాం.

మూ: మీ గ్రామములో సభేర్పాటు చేయించండి. పౌరులం దర్నీ సమీకరించండి. మేమూ వచ్చి ప్రబోధిస్తాం.

ఒక; 7, 8 ఏళ్ళక్రిందనే బయలు దేరిన ఆ తండాలలా సాగా ల్సిందే! వాటినడ్డకూడదు. మనం వాటి అడుగుజాడల్లో పోవచ్చు, వాటి కష్టనష్టాలు మనకుండవు వాటి అను భవాలు మన కుపకరిస్తాయి!

రెం; ఆ తండాల్ని అలా సాగనీండి! మన బాటలో పూలు చల్లుతారు! మనకు స్వాగతం చెప్తారు!

మూ: మన కార్వాలం వెనుక బయలుదేరదాం

[నేపథ్యంలో పల్లవి చరణాలు... ... ...]

ఒక; ఎవరెప్పుడు బయలుదేరితేనేం? బయలు దేరి తేసరి! ఐదో పంచ వర్ష ప్రణాళిక అంతానికల్లా స్వర్గం ఇదు గో అదుగో అంటూ ఉంటాం!

రహీ: అంటే? మన 40 కోట్ల మందిమీ ఇలా బయల్ దేఱీ పోవాలంటారా కార్వాల్ కట్టుకునీ, మన దేశంవదలీ పెట్టి? ఎబ్బెబ్బే! ఎంతా స్వర్గాం అయినా, మా కన్నా నేలా వదలం—

రా: కాదు రహీం. వీరిదంతా అలంకారయుక్తంగా చెప్తు న్నారు. మనం ఎక్కడికీ పోనక్కర్లే! ఆ స్వర్గమే మన

కాళ్ళ దగ్గిరికొస్తుంది! మన దేశాన్నే ఒక స్వర్గంచేసికో పోతున్నాం!

రహీం: అదీ ఎట్లా చెప్పండి. అలంకారాల్, అంతరార్థాల్ లేకుండా చెప్పండీ భాయ్!

ఒకడు: విను భాయ్.. మొదటిపంచవర్ష ప్రణాళికలో ప్రభుత్వం మం.ం కలిసి 31 శత కోట్లు వినియోగించి, భారతీయుడి సగటు దినాదాయం 70 నుండి 78 నయాపైసలికి పెంచుకొన్నాం. ఈ రెండోదాంతో దాన్ని 90 కి పెంచుకో బోతున్నాం. అందుకై ప్రభుత్వం 48 శతకోట్లు, మన ప్రజలం 14 శతకోట్లు పెట్టుబడి పెట్టుకోవాల.

రహీం: మఱితెల్యాకా అడుగుతా! మా నాయన జీతం రోజ్కి ఒక్కరూపాయ్ అయినా, మా యింట్లో పిల్లా, జెల్లా పది మందీ ఉన్నాం కందా! మఱి మా ఆదా పదీపైసల్ కదండీ!

శా: అవును రహీం. శతకోటీశ్వరులు, సహస్రకోటీశ్వరులు అయిన బిర్లాలు, టాటాలు, డాల్మియాలు, సింధియాలు బజాజులు... వాళ్ళ శిఖరోన్నత ధనరాసులతో కలిపి సగటు కట్టు. మన బికారుల శూన్య హస్తాల్లో అంతా ఉన్నట్లే!

ఒకడు: అంతే భాయ్! నీ మిత్రుడు చెప్పింది నిజం! ఈ ప్రణాళి కా హెచ్చుతగ్గుల్ని సమం చేయడానికే ఏర్పడింది. ఆ వారి శిఖరోన్నత ధనరాసు లుపయోగించి పల్లెల్లో ఉన్న మన పేదరైతుల, శ్రామికుల స్తోమతలు

పెంచుకోబోతున్నాం. కోటిన్నర నిరుద్యోగులకి పనులు కల్పించబడ్తాయి తెలుసా?

2 వ; వ్యవసాయాభివృద్ధి కొక్క ప్రభుత్వమే 563 కోట్లిస్తుంది

| | | |
|---|---|---|
| 3 వ: నీటి పారుదలకి | 486 కోట్లు | |
| 4 వ: విద్యుత్ ఉత్పత్తికి | 427 | ,, |
| 2 వ: భారీ పరిశ్రమలకి | 690 | ,, |
| 3 వ; కుటీర పరిశ్రమలకి | 200 | ,, |
| 4 వ; రహదార్లకి, వార్తా సంస్థలకి | 1385 | ,, |
| 2 వ; విద్యా, వైద్యసంస్థలకి | 945 | ,, |

1 వ. ఇలా ఒక్క ప్రభుత్వమే మొత్తం 4800 కోట్లు పెట్టుబడి పెడ్తుంది. ప్రజలు సహకారం, స్వయంసహాయం వర్షిస్తే, ఈ ప్రాణంలేని రూపాయలే ... పేదరికంతో అనారోగ్యంతో, అజ్ఞానంతో ఎండి మోళ్లయిపోయిన దేశాన్ని నందనవనం చేసేస్తాయి! సౌభాగ్యస్వర్గం ఇక్కడ సృష్టవుతుంది!

రహీం; బాబ్బా! చాలాసంతోషం అయింది. మాసహకారం స్వయంసహాయం కావాలీఅన్నారే— ఏం చెయ్యాలీ. చెప్పండి?

తా; సంఘసేవలో మాజీవితాలంకితం చేస్తున్నాం.

(చేతి లో చేయి వేయును)

ఒక; (కరచాలనంచేసి) వెరీగుడ్! మీలాంటియువకులు ఒకో గ్రామంలో పదిమందుంటే పంచవర్ష ప్రణాళిక పంచమాసాల్లోనే ముగియ గలదు ఇట్లు చూడండి.

మీ గ్రామానికీ ఓ ప్రణాళిక తయారు చేసికొని బ్లాకులో చేరండి. మన బ్లాకులోని నూరు గ్రామాలూ ఒక్క కార్యాగా పురోగమించి, త్రోవలో పడదాం. సౌభాగ్య స్వర్గం చేరుకొందాం.

రహీం: అరే బాబా! మళ్ళీ ఏకో అర్థంకాని అలంకారాల్లో చెప్తున్నాను!

రా: (పీపుతట్టి) నేన్చెపుతాలే! రా. ఇప్పుడే, ఇక్కడే నడుం కట్టి. కార్యరంగంలో దూకుదాం. (నడుంబిగిస్తాడు)

రహీం; అచ్ఛా! (నడుం బిగిస్తాడు)

ఒక: (తిరిగి మేకుహాంకు) రేపొస్తాం. మీ గ్రామంలో పౌరులందర్నీ సమీకరించి. ఒక సభేర్పాటుచేయండేం!

రా: తప్పక. నమస్కారం (నమస్కరించి, తిక్కిగి) చూడండీ సభేర్పాటు చేసుకునుంటాం మా పంచాయితీపార్కులో. ఇంకా... ...

ఒక; (చూపి) ఇలాటి ఫలకాలు కూడా తయారుచేయించి ఉంచండేం! జాతీయ పతాకోటి దొరుకుతుంది కదు? చాలు. ఇంకేం అక్కర్లే!

రెండ: ఏడాది కో రోజు ఆర్జనైనా పొదుపు చెయ్యండి!

మూ: నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్లు కొనండి!

నాల: మీనిల్వలు మీకు వడ్డిస్తాయి! అవే పేదలకి అన్నం పెడ్తాయి!

రహీం: అయితే నాకు తెలియక అడుగుతా, పొదుపు అంటార్ అదే మండీ?

ఒకడు: ప్రతి పౌరుడూ ఒక దినాదాయం అంటే సగటున ప్రతి భారతీయుడూ 78 నయాపైసలు చొప్పున—

రా: పదిమందున్న రహీం ఇంట్లో 10×78 =రు.7 — 80 పై. పొదుపు చెయ్యాలన్నమాట గదండీ.

ఒక: అవును. ఎప్పుడున్న పావలాతో అప్పుడొక చీటి చొప్పున కొని, పడేస్తూఉంటే —ఐదురూపాయలు కావటంతోటే దాంతో ఒక నేషనల్ సేవింగ్సు సర్టిఫికేటు కొనుక్కోవచ్చు! 12ఏళ్ళలో రు 8—25 పై. అవుతుందది.

రహీం: అంటే?

రా: ఇదిగో. ఇవి పావలా చీట్లు, ఇదిసర్టిఫికేటు! ఇంటికెళ్ళాక ఇంకా వివరంగా చెపుతాలే! 310 వేలొచ్చేవాళ్లు వెయ్యి రూపాయల సర్టిఫికేట్లు కొనాలి కదండీ?

ఒక: అవును. మనశబ్బు మనకు ఆవాలముద్దై నిలవుంటుంది! పైగా దాన్ని ప్రభుత్వ పరంగా ఉంచుకోన్నందున అలావచ్చే 50 కోట్లూ ప్రణాళికాకార్యాలలో త్రిప్పటం జరుగుతుంది. అదే మన దినాదాయాన్ని రూపాయకు పావలాలు పెంచుతుందై దేళ్లలో! ముఖ్యంగా ఈ పెరుగుదలంతా పేద కృషికుల, శ్రామికులలోనే కుపిస్తుందన్న మాట మఱవకండీ!

2 బిరాను;

గే॥ పల్లెలభాగ్యం ప్లాకులభాగ్యమె! ప్లాకుభాగ్యమది దేశముదీ
ఏకమనస్సుతో పదండి ముందుకు భాగ్య స్వర్గము
కనువరకూ (ప్రస్థానము)

రాము, రహీం (వారిననుసరింతురు) శెలవు

# విష్కంభము

(తెర ముందు వెంకయ్య, మీనన్ ప్రవేశము)

వెం; మీనన్ గారూ, స్త్రీ, స్త్రీలంటే ఒళ్లుమఱచి, కళ్లుమూసి, ఆదర్శం విడిచి ఆత్మగౌరవం బానిసేయువకుల్లో ...

మీ: దాన్నూ నిర్మమత చిత్రం అంటారు. అంతేనా?

వెం;యవ్వనారంభంలోనే కామక్షుత్తుకుగుఱయ్యేయువకుల్లో

మీ; దాన్నూ ప్రవర్తన విపరీతం అంటారు అంతేనా?

వెం: అవును మీ: ఇదేదైనా మనోవ్యాధంటారా?

వెం; కాకపోతే, ఆరోగ్య వంతుడు, పుంస్త్వాధికుడు అయిన వాడి యీ వైరాగ్యాని కర్థం ఏమిటంటారు?

మీ; నాకూ అలాగే తోస్తోంది. ఒకటడుగుతా, అతనికి మీ అమ్మాయి మీద విముఖత్వం కాని, ఇంకో అమ్మాయిమీద సుముఖత్వంకానికారణం కూడదా?

వెం: రామ! రామ! సీతంటే వాడికి తగని ప్రాణం అండీ! వాడి కోఱిక మీదే దానికి ఇంగ్లీషు చెప్పిస్తున్నాకూడ

మీ; ఉహూఁ! ... అయితే అతనామెకేం అయినా బహుమానాలెప్పుడైనా చెయ్యటం ఉందా?

వెం; ఎప్పుడూ లేదు. కాని ఒక్కసారి మాత్రం—అదైనా ఈ మధ్యే—ఫ్లోరెన్సు నైటింగేలు సేవా చరిత్రొకటి బహూకరించి నట్లున్నాడు.

మీ; ఉహూఁ! ... ఆమె? అతనికి? దాని ప్రతికృతిగా—

వెం; ఆఁ... సుభాష్ చంద్రబోస్ బొమ్మ—ఊలుతో అల్లిన డిజైను— బహూకరించింది.

మీ; (ఆలోచించి)— ఆఁ! అర్థంఅయింది. ఈ కేసు నేను పుచ్చుకొంటా, పదండి మీ ఊరు. (ప్రస్థానం)

# దృశ్యం 2

(వెంకయ్య ఇల్లు — ప్రవేశం కిష్టయ్య, రాము)

కిష్ట; మీ మేనమామరా అడుగుతూంది! నీ బాబుని... నేను నిన్ను పైకి చదివించలేక, కళ్లుతేలేసే సరికి, ఆ పైన అందుకొని, బస్తీలో పెట్టి, దొరబాబుకి నడిపినట్లు సర్వాం నడిపి చదివించి, నిన్నింతవాణ్ణి చేసిన మేనమామరా అడుగుతూంది! ఊ... అను.

రా; ... ... ... (తలవంచుకొనును.)

కిష్ట; ఒప్పుకో! సీతని చేసికొంటానను. వాడికింకా ఎవరైనా కొడుకులంటు ఉన్నారు కనకనా?...లక్షాధికారి! వాడి లక్షలన్నీ నీవే! శిరిరా మోకాల్లొడ్డకు. "ఊ" అను, వాడి ప్రాణం సంతోషిస్తుంది—

రా; అమరతు పెట్టి చేశాడా నాన్నా ఇదంతా?

కిష్ట; పిచ్చివాడా! మరతు లెందుకురా దీనికి? అది పుట్టినప్పటి నుంచీ 'రాముడికి పెళ్లాం పుట్టింది. రాముడికి పెళ్లాం పుట్టింది' అనుకోంటూరాలే? అందుకేగా దానికి సీతని పేరుకూడా పెట్టింది?

రా; ... ... ... (మాట్లాడడు.)

కిష్ట; ఇష్టం లేనివాడివైతే, నువ్వు పెట్టాల్సిందిరా ఆ మరతు? ...నువ్వు చేసికోక పోతే అది కన్యగా ఉండపోతుంది ట్రా! బలవంతంగా ఇంకోడికిచ్చి, కడితే ఏమనుకొన్నాం, గొయ్యో ... ...

రా; (చిరునవ్వి) కాదు. సీత పిరికిపంద కాదలా ప్రాణం తీసికోటానికి. హిందూసంఘంలో కన్యగా ఉండి పోయే అవకాశం లేకపోతే. దాన్నివిడి. ఏ బ్రహ్మసమాజాన్నో

కిష్ట; ఆ? నిన్ను నమ్ముకొని, వాడు కన్యాదాన ఫలంగూడా దక్కించుకోలేదురా!... నీకు నచ్చాలనీ, దానికిదొరల చదువు చెప్పించాడు కాదట్రా? ఇప్పుడది శాశ్వత కన్యగా ఉండిపోతే... తీగెకీ కాయ భారమే అవుతుంది! వీట్లో గుడిసె వేయిస్తాడు! అదొకవేళ ఆత్మహత్యకిజంకి నువ్వన్నట్టే చేస్తే - వెంకయ్య పుత్రీ హత్యకీ ఆ పైన ఆత్మహత్యకీ కూడా జంకడనుకొంటా.

రా; (నవ్వి) ఉహూం! అది కన్యగానే ఉండిపోతే ఆత్మహత్యకి జంకికాదు! మానవులందరికీ చోటున్న విశాల హృదయంలో ఏదోఒక్క వ్యక్తికి పీటవేసి తీరాలనే సంఘ శాసనానికి రోసి. జీవితం విలువ సీతకి తెలుసు!

కి: (పండ్లు కొరికి, కోపంతో) అయితేరామూ, మేనత్త మేనమామబిడ్డలూ, స్త్రీ పురుషులూ అయిన మీ మధ్య ...యవ్వనంలో ఉన్న మీ మధ్య ఈ ఏకత్వానికి కారణం ఏమిటో నాకర్థం కావటంలే.

రా; అనార్ సలీంలం; లైలా, మజ్నూలం అనుకోవద్దు మేంనాన్నా! ఈ లౌకికాలన్నిటికీ అతీతులం నాన్నా! అవీ... లోకహితాలు!... పవిత్రాలు!! ...దివ్యాలు!!! విశాలాలు!!!! త్యాగమయాలు!!!!! సేవార్పితాలు!!!!!!

కి: (కొంత ఉద్రేకంతో) అయితే దాని హృదయం నీకేలా

తెలుసు? నువ్వు దానికేమైనా బోధించి, తయారు చేస్తున్నావా? (ఉద్రేకం మింగి) పోనీలే! ఇద్దరూ కలిసి, ఏ బ్రహ్మసమాజంలోనో జీవించటం దేనికి? మా కళ్ళకి జంటపండుగల్లా మా నట్టింట్లోనే ఉండిపోరాదూ? మీ ఆశయాలకేం అడ్డురామే! మరి మా ఆశలపై ఈ గొడ్డలి పెట్టెందుకు?

రా: ఆఁ!...సుభాష్ చంద్రబోస్‌లా నేను, ఫ్లారెన్సు నస్య లా సీత...సంఘసేవలో జీవించాలనుంది.

కి: అసంభవం! మీరూ మానవమాత్రులు! దేవతలేం కారు! ఉప్పు, కారం తినే యవ్వనులు! ఇనుప కచ్చడాలు కట్టిన ముని పుంగవులకే కుదురలేదు కాని; ఇంక మీకా? ఒక వేళ మీరిద్దరూ... మొగుడు, పెళ్ళాం కాకుండా ఉండగలరేమో కాని ఎవరు ఎవరికో ... నువ్వు భర్త, అది భార్య కాకుండా ఉండగలరా? ఉండ లేరు. అది ప్రకృతికి విరుద్ధం!

రా; మేం ప్రకృతికి ఎదురీదుతాం నాన్నా. బ్రహ్మచర్యం నుండే సన్యాసం తీసికోలే ఆది శంకరులు?

కిష్ట; ఒరే! నాకు చెప్పకురా అదంతా! అందుకేగా కాళ్లు, చేతులు కాల్చుకోవలొచ్చిందాయనకి? చచ్చేముందు బయటపడలే హిట్లర్ బ్రహ్మచర్యం ఎంతటిదో? అలాగే నీ ఆరాధ్యమూర్తి సుభాష్ చంద్రుడికూడా యూరప్‌లో ఎక్కడో భార్యుందని వినం? ... మరి మన నాయకుడు——

రా; ఆగండి దయచేసి అంతటితో! మా ఆదర్శనాయకులిని ఆడిపోయకండి. లోకులు కాకులు. పిల్లితోకచూచి పులి పులి అంటారు! కిట్టని వాళ్ళదుష్ప్రచారాలు నమ్మకండి

కిష్టు; ఋజువులు, సాక్ష్యాలు: దృష్టాంతరాలు ఉన్నాయి. నిప్పు లేందే పొగ రాదు.

రా; మా హృదయ మందిరాల్లో ఉంచుకొని, ఆరాధించు కొంటున్న మా ఆదర్శ దేవతల కే వంకలూ లేవు... వారి చరిత్రల్లో అర్థంకాని అధ్యాయాలేమైన ఉంటే ఉండవచ్చు కేవలం కాని, మురికి పుటలు మాత్రంలేవు

కిష్టు: నాకు తెలియదదంతా. అడుగో మీమామే వస్తున్నాడు ఏం చెప్పుకొంటావో ఏమిటో నా కెందుకు?

వె; (ప్రవేశం) చెప్పుకోటానికేంఉంటుంది కాకిష్టయ్యా! పసివాడు! వాణ్ణడిగితే ఏం అంటాడు? తాంబూలాలు తనే పుచ్చుకుంటా నంటాడా ఎవరైనా పెళ్లికొడుకు? ... అలా అంటూనే రేపు వాడే వచ్చి కూర్చుంటాడు పీటలమీద

రా: (వినుట అభినయిస్తాడు.) [నేపథ్యంలో...]

వ॥ భగవద్భక్తిలో కలిగే బ్రహ్మానందం తరువాత దేశభక్తిలో కలిగే త్యాగానందమే గొప్పది॥

సీ॥ మందార మకరంద మాధుర్యమున దేలు
మధుపంబు వోవునే మదనముల కు?
నిర్మలమందాకినీ వీచికలదోగు
రాయంచ చనునె తరంగిణులకు?
లలిత రసాల పల్లవ ఖాదియైచొక్కు—

కోయిల చేరునే కుటజములకు?
పూర్ణేందుచంద్రికా స్ఫురిత చకోరకం
బరుగునే సాంద్రనీహారములకు?
గే॥ అంబుజోదర దివ్యపాదారవింద
చింతనామృత పానవిశేషమత్త
చిత్తమేరీతి నితరంబు జేరనేర్చు?
కేశ సేవానురక్తయుద్విగ్న దివ్య
చిత్తమేరీతి విహసుఖాల్ చిత్తగించు?

(దీపాలు ఆర్తాయి. నీలపు ఫోకసింగు. ఫ్లూటు పై మందరంలో నాగస్వరం వినిపిస్తుంది)

మీనన్: (వెనుకగా ప్రవేశించి, దండంతో కిష్టయ్యని ... చేసి, రామూను కన్నార్పక చూస్తూ దండం ... తాడు)

రాము: (... ఖ్ళమూస్తాడు.)

మీనన్: రామూ!

రా: ఊఁ

మా: నీ అర్థపటాకు మనస్సులోకి పో

రాము: ఊఁ (వేలుతో చూపుతూ)... అ... అ... అదిగో నాహృదయం (రాముపై మాత్రం ఎట్టి ఫోకస్, ఫ్లూటు పై నాగస్వరం) దానిచుట్టూ గిఱ్ఱున తిరుగుతూందొక వెలుగుచక్రం! దాని మధ్య... అదిగో... అది సీతను కో ... వెలుగుకి నాకళ్ళు మిరుమిట్లు గొల్పు తున్నాయి ... ఉండండి, ఆప్రసక్క నే అమ్మ,. నాన్న

మామకుండ ఉన్నారు ... ఆఁ... వారంతా తూగుతున్నా రేవో కాటాలో! ... తేలిపోతున్నా రే! ... క్రిందిపల్లెంలో అదెవరు? నా గ్రామం! నా గ్రామస్థులు!

మీ: ఉహ్హాఁ! ... సీతెలా అగుపిస్తోంది?

రా: సీతా? ఆ అనంత మానవకోటిలో ఒక్క తెగా అగుపిస్తోంది!

మీ; సరే. సీతను నీవు ప్రేమించటం లేదా ?

రా: ప్రేమిస్తున్నా.

మీ: పెండ్లి చేసికొంటావా?

రా: (నిట్టూర్చి) పెండ్లి? ... కళ్లు, తల తిరిగి పోతున్నాయి

మీ: (దండముతో స్పృశించి) ఇప్పుడో ?

రా: బాగుంది ...

మీ: సీతను పెండ్లి చేసికొంటావా? ఆమెకు నీ హృదయం లో స్థానం లేదా ?

రా; ఆ... అదిగో! సీత... నా హృదయ పద్మంలో నిలిచి ఉంది ... దివ్య నాట్యం చేస్తోంది ... అరుగో ... సోదర గ్రామస్థులు ... అంతా చుట్టు ఆవరించి పూరేకుల్లా పొదువుకుంటున్నట్లున్నారు ! వారంతా నా సేవలభిలషిస్తున్నట్లున్నారు! ... ఏం చెయ్యాలో తోచటం లేదు. నా ప్రేమకు అంతు, హద్దు ఉన్నట్లు లేవు! [దీపాలు వెలుగుతాయి]

మీ; (దండంతో దిగతుడిచి కిష్టయ్యని) వెంకయ్యగారు మరి కొంత సేపటికి కాని రామూ మనలోకంలోకి రాడు కిష్టయ్యగారూ, రామూని నిద్రబుచ్చి, ఆతని హృదయంలో

రహస్యాల్ని కొంత వఱకు చూపాను. బాహ్య శక్తులకు జంకి నిజరూపంలో సంచరించలేని అతని మనోభావాల్ని చాలవఱకు తెలిసికోగల్గాం కదూ!

ష్ట: ఆ. ఆ. మాటం లేపకిపోయింది కాని, చూస్తూనేఉన్నా. మీరుగొప్పవారు. చికిత్సకూడా మీరే చేసి మావాణ్ణి మళ్లా మామూలువాడ్ని చేసి, పుణ్యం కట్టుకోండి. మీ కడుపున పుడ్తాం,

వె: వా డే సిద్ధార్థుడోలా సన్యసించకుండ చూడండి, బాబూ.

మీ: ఊం. రోగనిదానం అయిందికదా! ఇంక చికిత్స కని పెట్టాలి. ఓ నెల పట్టచ్చు మొత్తం.

వెం: కానివ్వండి. ఎంతకాలం అయినా సరే! ఎంతడబ్బైనా సరే! మా రాముని తిరిగి మావాణ్ణి చెయ్యండి.

కి: మా రెండుకుటుంబాలకివాడే! నా కొడుకైనా,

వెం: నా అల్లుడైనా, సీతే కూతురైనా,—

: కోడలైనా!

మీ: కానివ్వండి. ప్రయత్నిద్దాం. ఆపైన దేవుడున్నాడు. అతు రాలా కళ్యాణానికుపయోగించే నా శక్తి సార్థక మవుతుంది. తిఱిగి దర్శిస్తాం (ప్రసానం)

వెం: వెంకటేశ్వర స్వామీ, తండ్రీ! మా వాణ్ణి తిరిగి మాలో కలుపు. నీకొండకొచ్చి, వెయ్యినూటపదార్లు కొబ్బరి కాయలు కొట్టా.

కి: చేతి మురుగులు, చెవులపోగులు, తలనీలాల్తోసహా నిలువు దోపిస్తా సామీ! ఏడుకొండలవాడా! (ముడుపు కట్టి)

వెంకట రమణా! వడ్డీకాసులవాడా! ఆపద మ్రొక్కుల వాడా రక్షించు తండ్రీ! మావియ్యం ఖాయం చెయ్యి.

వెం; వ. కోట్లాంధ్రుల కులదేవతా, ప్రత్యక్షబంధూ, ఇదిగో ముడుపు కడ్తున్నా. ( ఉంగరాలు తీసి ) మా రాముని మాకు దక్కించు. (ముడి కడ్తూ. నిష్క్రమణ)

కి: కాంగ్రెసూ, కమ్యూనిష్టూ వాళ్ళలా మావా డ్జైలుకో పోకుండా చూచి, కాపాడు శ్రీనివాసా! పద్మావతీ నాధా! దేవుడివి నువ్వే చేసికొన్నావు పెళ్ళిమీద పెళ్ళి! మావాణ్ణి బ్రహ్మచారి సన్యాసిగా ఏంచేస్తావురే! స్వామీ కరుణించు. ( నిష్క్రమణ )

( తెలివడి, తిరిగి లేచును. )

## దృశ్యము 3

[చేను. మీానన్, రాము]

మీా: ఎంత మనోహరంగా ఉందీ దృశ్యం! వచ్చే యీా రోజుల్లోనాగార్జునసాగర్ కుడితట్టు కాలువొస్తే, ఈఅందంఅంతా పోతుంది కాబోలు!

రా: ఆ.

మీా: ఇక్కడి నుండివిను. మధ్య ఏతాం మీాద వాడు పాడే పాటకి ఇటు, అటు ఏతాంలమీాద వాళ్లు తీసే రాగాలు వంతల్లా లేవు? మధ్యవాడి మోట దొాణ దొాణ, కిచ కిచ లకీ, ఇటు అటూవాళ్ల గలగలలు, జలజలలూ స్రుతీ. తాళం వేస్తున్నట్లు లేవు? ఇదెంత అపూర్వదృశ్యం అంటావు?

రా; ఏతాంలమీద వాళ్ళ బ్రతుకులు కత్తుల మీద సాములు కావంటారా మీానన్‌గారు? అగుపించే ఈదృశ్యంలో అణి గుండే అదృశ్యమెు?.. వారి ప్రాణాల రెప రెప పైకి వినిపించేదికాదు! వారి చెమటధారల్లో కలిసి, ప్రవహించే వారి నెత్తురు ధారలు పైకి కనిపించేవికావు!

మీా: అదట్లాఉంచు. మండు వేసవిలో కూడా వాగుచెలమల్లో నీరుంటుందే?

రా: ఆ. ఉంటుంది! ఎండిపోయిన కండలు పనిచేస్తే నీరు రావటంలే ఆ మోాట తిత్తుల్లోకి?

మీా: సరే. కొండలమీాద కురిసే వానంతా వాగులై మన ముందు ప్రవహిస్తుందేం?

రా: (నవ్వి) మనబావుల్లో, చెఱువుల్లో జీవనాలన్ని ఆరిపోగా ఏర్పడే మేఘాలన్నీ ఆకొండల ఒళ్ళలోనే కుమ్మరించాలి? వాటి మోాచేతి ధారలేగా ఈ వాగులు?

మీా:— రామూా,

రా: ఊం, ఒక్క గంట ఆగండి. 'నదీనాం సాగరోగతిః' మనకు శాశ్వతం అల్లా యీాదుమ్మే!

మీా: రామూా, చిత్రంగా ఉంది. మాబోంట్లానందంతో పొంగి పోయే యీాఅందమైన దృశ్యం నీ కంతాదుఃఖమయం గానే తోస్తున్నది? అపరసిద్ధార్థుడిలాఉన్నావు.

రా: చూాడండి మీానన్‌గారు, లోకంఅంతా అధికారం, ద్వేషం, దోపిడీ! వాటికి సేవ, ప్రేమ, త్యాగం తరణో పాయాలు!

మీ: అయితే ఏంచేస్తానంటావు? నీ కానందం ఎందులో లభిస్తుందంటావు?

రా: "విశ్వైకకుటుంబ" దర్శి రవీంద్రుడు, భారతజాతి పిత గాంధిమహాత్ముడు, ఆంధ్రోద్ధారకుడు శ్రీరాములు వాళ్ల ఆదర్శాలు నా బోంట్లకి అతీతా లనుకొంటా.

మీ: మరి...

రా: మరి 'గ్రామైకకుటుంబ' కాదర్శం నన్ను నిలుకెల్లా గగు ర్పొడుస్తోంది. జీవితం నా గ్రామసేవలో గడిపెయ్యగలిగితే?

మీ: బాగుంటుంది. అందులో సీత సహచారిణైతే చాలా అనుకూలిస్తుంది. ఆమె, ఆమెలక్షులు ధన్యం అవుతాయి. మీ సేవలబ్బితే మీ గ్రామం ధన్యంఅవుతుంది!

రా: కాదు. భార్య లేకపోతేనే జవహర్లాల్ నెహ్రూ దేశాని కెక్కుడు సేవచేయగలుగు తున్నాడేమో! ఇందిర సాయంతో సేవచేసే నెహ్రూలో త్యాగమే తప్ప స్వార్థం ఏమిలేదు.

మీ: అవును. దేశీయుల్లో పెచ్చుపెరిగే యీ స్వార్థానికీ, అవినీతికీ పెళ్లీ, సంసారం, ఇవే కారణాలేమో నని పిస్తున్నాయి నాకున్నూ.

రా: స్వరాజ్యం, స్వరాష్ట్రం వచ్చేశాక ఇంక కోరాల్సింది సౌభాగ్యమే. నా చెవుల్లో రింగ్ముంటున్నాయి మొన్నటి బి. డి ఓ. గారి వాక్కులు, నాటి ఆ పాట.

[నేపథ్యంలో: పల్లవి. ... ... ... ...]

నా గ్రామాన్ని సమీకరించి, మొదటి మెట్టులో ఉన్న సమాజవికాసతండంలో కలిపేస్తాను. అదే పడ్తుంది కార్యాలవరుసలో!

మీ: (స్వ) చికిత్సా విధానం ఇతనినోటనే రాబట్టాను. ఇదే అదను. ( దీపాలు ఆర్తాయి— ఆకుపచ్చని ఫోకస్— తండంతో తాకి, ప్రకాశంగా ) రామూ,

రా; ప్రతిగ్రామం... ... ( కనులుమూసి )

మీ; ప్రతిగ్రామం ఒక్కొక్క ఐదేళ్ళపథకం వేసికొని, దేశకార్యాల వరుసలో కలుస్తే—

రా: ఒక తియ్యని కల—

మీ; ఒక తియ్యనికల ఒకఅతివాస్తవిక జీవితంగా మార్తుందంటావు!

రా; అవును. కమ్యూనిటీ ప్రాజెక్టులద్వారా

మీ; దేశం స్వర్గం అయిపోతుందంటావు! ( బండపై కూర్చొపెట్టును – నేపథ్యంలో నాగస్వరం——)

మీ: రామూ,

రా; ఊఁ.

మీ: నీ ' లో— మనస్సు ' లోకి వెళ్ళా ( ఎఱ్ఱఫోకస్)... నీవు లక్షాధికారివి కదూ?

రా; అవును.

మీ; పలుకుబడి కలవాడివి నీ గ్రామంలో.

రా: అవును.

మీ: నీ ఆశయం ఏమిటి? దాని నెలాతీర్చుకొంటావు? నీ కేదైనా పథకం ఉందా?

రా: ఏదో చల్లని — తీయని -- అనుభూతి! ( సీలిఫోకస్ )
పండువెన్నెల్లు — చల్లగాలులు — పూల వానలు — ఏలపాటలు — అంతా ఏదో తియ్యని అనుభూతి ! ...

మి: ఆ అనుభూతిలో?

రా: దానిలో ఒక చంద్రకాంతశిలాపీఠీ — తూగుటుయ్యెల — దానిపై ... ఎవరమ్మా నీవు? ... తలపైగల మల్లెల చుట్టుకుదురుపై క్షీరభాండం, దానిపై మకరందపాత్ర ఒడిలో ధాన్యపు కంకులు, చెఱకుదంట్లతో సాక్షాత్క రించి, చేతులుచాచి, కళ్ళతో పిలుస్తున్నావు! నీపచ్చల చీరపైటా, నిన్ను ఎక్కడో చూచినట్లున్నాను! ... ఓహో! నాగ్రామమాతవి! నమస్కారం, గ్రామమాతా నమస్కారం.

మి: గ్రామైక కుటుంబకమ్!

రా: ఏంఅమ్మా "గ్రామలక్ష్మీ" నీ నిజస్వరూపంతో నాకిలా సాక్షాత్కరిస్తున్నావా?ధన్యోస్మి! గ్రామరూపంలోఉన్న నీవిశ్వరూపాన్ని గుర్తించలేక పోయాను! నాపై నీకెంత దయ!

మి: గ్రామైక కుటుంబకమ్!

రా :అమ్మా! నీ ఒడిలోకి నన్నుతీసికొంటున్నావా?
ఆహా! ఏమి భాగ్యం! గ్రామప్రజారూపమైన నీయొడిలో నడిబొడ్డునినేనే! ... నాచుట్టూనే నా సోదరగ్రామస్థు లంతా ఆవరించి ఉన్నారు, వారంతా నాకేవో తెస్తు న్నట్లున్నారు,

మి: ఏం తెస్తున్నారేం?

రా: వీరంతా—ఏదో ... అన్యోన్య సహకార – స్వయం సహాయక కుటుంబంలా ఉన్నారు! సాలెవాళ్ళు ... నాకోసమే! ... ఏవో తాపితాలునేసి, తెచ్చి, అందిస్తున్నాడు. కంచరి పాత్రలు, చాకలి ఇస్త్రీదుస్తులు, కమసాలి ఆభరణాలు తెచ్చి, బహూకరిస్తున్నారు. మేదరి, తాపీ, వడ్రంగి, వీరు, వారు అంతా ఏవేవో ఉపాయనాలు తెస్తున్నారు! వీరంతా ... ఎందుకో ... నా కోసమే ... జీవిస్తున్నట్లున్నారు! వీరికి నే నేంకావాలి?

మి: భజంత్రీలో?

రా: భజంత్రీలు జనకళ్యాణానికై సానాయిలు శ్రుతిచేసికొంటున్నారు! స్త్రీలంతా మాకేవో హారతులు తెస్తున్నారు

మి: నీ కళ్యాణమే కావాలి!

రా: నా కళ్యాణమే అయితే గ్రామంలో వీరందరికీ ఎందుకీ అడావిడి?

మి: నీ కళ్యాణమే గ్రామకళ్యాణం!

రా: నా గ్రామకళ్యాణమే నా బ్లాకు కళ్యాణం!
నా బ్లాకు కళ్యాణమే నా దేశకళ్యాణం!

మి: మనదేశ కళ్యాణమే ప్రపంచకళ్యాణం కూడ! ! !

రా: అయితే వీరందరికీ నేనేం అవుతాను? వీరి ఋణం అంతా ఎలా తీర్చుకొంటాను? వీరి సేవకి ప్రతిసేవ నేనేం చెయ్యగలను?

మీ: నీ కళ్యాణం అయితే నీ పెండ్లికూతు రెవరో? సీతకదూ?
[పిస్తోలు మోత—దీపాలు ఆర్తాయి — ఎఱ్ఱని వెలుగు ఫోకసింగు]

రా: అబ్బ! హతోస్మి! (నిట్టూర్పులు) దీపం ఆర్పేశారు? కళ్ళు చీకట్లు క్రమ్ముచున్నై ... ఎవరోయీ తెఱ దించేశింది? ... నేను బ్రహ్మచారిగనే ... గ్రామహితార్థం— సన్యసిస్తే నీకెందుకు?

మీ: (స్వగతం) ఛా! ... పొరపాటయింది. (ప్రకాశంగా) అదుగో బాపూ! భారతపిత అమరజ్యోతి! (ఒకొక్క దీపం వెలుగుతుంది — నేపథ్యంలో పాట! నగారా— ఫ్లాటుమాత్రం —— గాంధీపటం గోచరిస్తుంది. మందరంలో పాట)

గీ: బాపుజీ మహాత్మాగాంధీ! భారతస్వాతంత్ర్యజ్యోతీ
భారత సౌభాగ్యజ్యోతీ!
స్వేచ్ఛసు దెచ్చి, దాస్యము పోద్రెంచి, ధన్యత చేకూర్చి
హృదయములో, చరితములో, పూజల నిటు నిలిచితి
(ఫ్లడ్ లైట్లు వెలుగుతాయి) కద! బా

రా: నమస్తే! (కనులు క్రమక్రమంగా తెఱుస్తూ) బాపూ వెలిగించిన అమరజ్యోతి జగత్తుకేజ్యోతి! జగజ్జ్యోతి! పదునాల్గు సూత్రముల ప్రపంచితజ్యోతి! కలిసి వెలుగుతే?

మీ: వెలిగించు రామూ, నీవే అందుకు సమర్థుడివి! అందుకే నీవు పుట్టినది!! (తెఱపడి, లేచును)

# దృశ్యము 4

[ప్రవేశం మీనన్—వెంకయ్య, కిష్టయ్య కూర్చుని ఉండగా వెంకయ్య యింటిలో...... ]

మీ; ఒకే ఒక్క చికిత్సావిధానం ఉందండీ చెయ్యగలుగుతే!

వెం: చెప్పండి. అనుమానించక చెప్పండి. చేస్తాను.

మీ: మీ ఆ స్తంతాఎంతుంటుందండీ అసలు?

కి; 200 ఎకరాలపల్లం, 100 ఎకరాలమెట్టా—

వెం; ఒకలక్షరొఖం, నగా, నట్రా, ......ఊళ్ళో ఒకటి, పేటలో ఒకటి రెండుమేడలు, ... అన్నీ దానికే... సీతకే! దాన్నిచేసికొంటే రామూకే!

మీ; సరే ననుకోండి. మీరొక సాహసం చెయ్యాలి... ఆ స్తంతా రామూపేర వ్రాసెయ్యాలి, సర్వహక్కుల్తో...ఇప్పుడే! ... ఏం? అలాచూస్తారేం? భయం లేదు. ఆదర్శమూర్తులు మోసంచెయ్యరు! రామూ ఆదర్శమూర్తి!

వెం; ( చిరునవ్వుతూ ) వ్రాసేస్తా. నాకే అనుమానంలేదు, ఒకవేళ అటుసూర్యుడిటుపొడిచి, ...అవకూడంది దైనా కానీ! ... వాళ్ళిద్దర్నీ కలపటాని కంటే ఎప్పుడైనా ఏదైనాచేస్తాను! ఇప్పుడే, అంతా వ్రాసిస్తాను!

మీ; సరే. వినండి. నాతో ఒక బ్రహ్మాండమైన గ్రామాభ్యుదయపథకాన్ని గూర్చి చర్చించాడు రామూ, దానికెంతో ధనం కావాలిట! సగానికి సగం ప్రాజెక్టు వ్రాశిచ్చినా. అదిసవ్వైతే, నెమ్మదిమీద సుముఖుణ్ణి చేసికో వచ్చతన్ని.

వెం; ఆ మూడుముళ్ళూ వేసి, కొంగుముడితో నాకు ప్రెమికాలి కాని, అంతా ధారపోస్తాను.

కి; ఇప్పుడైనా ఆపరతు పెట్టి, మరీముందుకుపో వెంకయ్యా! ఆ తర్వాత తెవరెన్నిఅనుకున్నా ఏం ప్రయోజనం ఉండదు.

మీా; అయ్యబాబోయ్! ...అలా కూడదు. అసలు వ్యవహారమే చెడచ్చు! సీతా, రాముూకలిసి, గ్రామసేవలో తిరగనిండి కొన్నాళ్ళు. ప్రేమకదే దారితీస్తుంది! పెళ్లి సంగతి తరవాత! ...ఇలాటి వ్యాధుల కిట్టిదే చికిత్స!

వెం; అలాగే కానివ్వండి!

కి; అంతే నంటారా?

వెం; అంతేకిష్టయ్యా. బాగుందీ వివాహపథకం. (చిరునవ్వు

మిా; మీాకు తోడు, ఇంకాఒక రిద్ద ఆిలాగే సహాకరిస్తే, ఆపైన జిల్లాబోర్డు, పంచాయితీబోర్డు, డెవలప్మెంటుబ్లాకు కూడా సహాయంచేస్తాయిట!

కి; ( బాగుందన్నట్లు అంగీకారసూచనగా )

రా; 'ట' ఏమిటి? చేసితీర్తాయి, మేం ఇప్పుడే మనబ్లాకు అధికారితో మాట్లాడొస్తున్నాం. మన గ్రామాన్ని రెండో 'నిలోఖెరీ' యో 'పిలాని' యో చేసేద్దాం. మన పొరుగునే ఎన్ని సోవియట్ గ్రామాలు లేవు? బ్లాకు లంటే ఏమిటి? సోవియట్లలాటివే ! ... ఇవాళ సాయంత్రం మీాటింగు

రహీం; (ప్రవేశించి) కరపత్రాల్ అన్నీ పంచీ వచ్చాన్ భాయ్ గ్రామంలో.

రా; సరే. మిగతా పని చూడు. (రహీం ప్రస్థానం)

మీ; మీ మామగారెవో శెలవిస్తున్నారు రామూ

వెం; లక్షరూపాయలు రొక్కంతో సహా నా యావదాస్తి రామూ నీ పేర వ్రాసేసి, —

రా; వ్రాసివ్వక్కర్లే! వాగ్దానం చెయ్యండి చాలు నేటి మహాసభలో! ఒరవడిపెట్టిన వాళ్లవుతారితర దాతలకి! సమాజవికాసోద్యమానికి జలకులౌతారు! గ్రామోద్ధారకులౌతారు!

వెం; వాగ్దానం చేస్తున్నా. నా ఆస్తికాదు. శరీరంలో నా రక్తం ఉన్నంత వరకు నా జీవితాన్నే వాగ్దానం చేస్తున్నా. నిష్కామకాంక్షతో ముడుపు కడుతున్నా. నా సర్వస్వాన్నీ! కాటికి కాళ్ళు చాచా. భార్యా? లేదు. కూతురైనా, కోడలైనా ఆ నలుసొక్కటి! కొడుకైనా

మీ; మేనల్లుడైనా—

వెం; రామూ, (చేతులు పట్టుకొని) నీవొక్కడివే! మీకే యిచ్చుకోవాలి! లేకపోతే—

రా; లేకపోతే దేశానికిచ్చుకోవాలి! అంతేకాని, ఏ ఆదర్శాలూ లేని ఎవణ్ణో తెచ్చుకొని వాడికి కట్టపెట్టరు కదా!

వెం; అవును రామూ (భుజాలపై చేతులుంచి) కళ్ళలోకి

చూస్తు) నా రక్తంఒకను ప్రేగొంకను! మీ యిద్దరి చేతుల్లో పెడ్తున్నా నంతా!

మీ; నిష్కామకాంక్షతో!

వెం: నిష్కామకాంక్షతో! సాయంత్రం బహిరంగసభలో ప్రకటిస్తా. చాటిస్తా. ఆ ఉత్తేజంతో దేశాన్లోతే. మరో దాతలో కూడా త్యాగాగ్ని రగుల్కొనచ్చు అప్పుడే! అక్కడే!

రా; ఇప్పుడే ఎవరూ రాకపోయినా పరవాలేదు. మామయ్య ముందుకొచ్చాడు చాలు. అదే పదిలక్షలు! మనగ్రామ వికాసపథకం మొదటిఅంచెకి వలసిన సైకం అమరింది! పనిచూచి, అప్పుడేవస్తా రెందరో దాతలు!

మీ: మీ గ్రామం ధన్యం!

రా: ముందు పోతున్న రెండోఅంచె సమాజవికాసతండాల్ని చూచిదిగులక్కర్లే! మనం జాతీయ సేవాపతండాల్లో – అంటే ఒకటోఅంచె సమాజవికాస తండాల్లో కలిసి పురోగమిద్దాం.

[నేపథ్యంలో పల్లవి.........]

వెం: ప్లానంతకీ వందల, వేల–కోట్లు కావాలంటున్నారే! ఎంతైనా నా ఆస్తి 10 లక్షలే ఉంటుంది – చాలుతుం దంటావా?

రా: (నవ్వి. చాలకేం! మన గ్రామ పథకం మొదటిఅంచెకి ఎక్కువ! వెధవ రూపాయలకి ప్రాణంఎక్కడిది! అవైతే

వెం: సీత!

రాము, మీ నన్; కోశాధికారి!

కిష్టయ్య: మాటలు కలిశాయి! తథాస్తు! (గంటలు వినిపి
స్తాయి) తథాస్తు!.

రహిం: (ప్రవేశించి) సీత అమ్మ వచ్చింది, మీటింగ్‌కీ
ముందుకూ రేగింపుకీ సిద్ధంచేసీ! బి. డి. ఓ. గార్ కూడా
దయచేశార్! పోదాం. లేవండీ.

అందఱు: (స్వరమేళలో) పాట.

మంగళం

కావలసిందే శతకోట్లు, సహస్రకోట్లు ... ప్రాణప్రదమైన శ్రామికబలం కొనటానికైతే!

"ప్రణాళిక పెట్టుబడి ప్రతి 100 కోట్లలోనూ 80,90 కోట్లదాకా యీ శ్రామిక బలగంగా మార్చుకోటాని కేనూ" - అనలే రాజెన్ బాబు?

మీ: అవును. "అధికార్లం అనుకొంటున్న ఉద్యోగు లంతా సేవకులం అనుకొని, ప్రజల్లో ఉండి, ప్రజల్తో తిరిగి ప్రజలకు సేవచేస్తుండా" లనలే నెహ్రూ?

కి: అది సరే! ... నాకు తెలియకడుగుతా, శ్రామికులందర్నీ ఊరికే కష్టంచెయ్యమంటూరా? మరి వాళ్ళకి పొట్టలెలా?

వెం: అందర్నీ వెళ్ళి, ఏ నాగార్జునసాగర్ కాలువలో త్రవ్వమనరుకదా?

మీ: ఎబ్బె! అలాటి పెద్దపనులు వేరండీ!

రా: ఎవరింటిముందు మురుగుకాలువ వాళ్ళు కట్టుకొంటా రనుకోండి ఓవర్సీర్ ప్లాను ప్రకారం ఊళ్ళో మురుగు నిలుస్తుందా? కూలీయిచ్చి చేయించాలంటే ఎంత పని కైనా లక్షలూ చాలవు! శతకోట్లు చాలవు!

మీ: ప్రతిగ్రామస్థుడూ వారానికోరోజు శ్రమదానం చెయ్య గలుగుతే, రెండు గ్రామాలమధ్య రోడ్డు కి కావల్సిన సాధకసంపత్తి నంతా ప్రభుత్వం యిస్తుంది!

రా: మీనన్ గారు, మీరు మా గ్రామంలో ఉండిపొండి, మా పథకసమితికి నాతో సహాకార్యదర్శిగా! మామయ్య అధ్యక్షుడు——

# *Epilogue*

పంచవర్ష ప్రణాళికలు, కమ్యూనిటీ డెవలప్మెంటుబ్లాకులద్వారా ప్రభుత్వం తలపెట్టిన దేశ పునర్నిర్మాణోద్యమ ప్రాశస్త్యాన్ని, దాని నిర్వహణలో ప్రజాపాత్రయొక్క ప్రాధాన్యాన్ని గుర్తింప జేయుటకై తలపెట్టబడిన ప్రకాంక్ష నాటికయిది.

దంపతీ ప్రేమ సహజమైనను, దైవభక్తివలెనే దేశభక్తి అసహజము కాదని గ్రామీణ పూర్వాచార పరాయణులు గుర్తెరుగ గలరు.

స్త్రీ పాత్ర లేకున్నను నాటిక రక్తికట్టునని చీరాలలో గుంటూరుజిల్లా బ్లాకుడెవలప్మెంటు వారి ఆధ్వర్యమున జరిగిన నాటక పోటీ ప్రదర్శనములలో దీని ద్వారా ఋజువు చేసిన [illegible] హైస్కూలు విద్యార్థులు శ్రీనివాసరాజు, కృష్ణమూర్తి, దానయ్య, మోహనరావు, పౌలు, అదృష్టాచారి మొదలగు వారభినందనీయులు.

జై హింద్! హాజ్... ముబారక్!